నంతరం యీ సహస్రనామ పారాయణ చెయ్యాలి జప పూజా దులకు అసమర్థుడైతే యీ సహస్రనామ పారాయణాన్ని మాత్రం చెయ్యవచ్చు.

ఈ స్తోత్రపారాయణ మాత్రంచే సంపూర్ణ పూజ జపాల వల్లా కలిగే ఫలం పొందుతారు. శ్రీ చక్రార్చన, శ్రీవిద్యాజప, సహస్రనామ పారాయణ, సంధ్యావందనాది నిత్యకృత్యాల వలె విధిగా చెయ్యాలి. శ్రీవిద్యోపాసకులైన భక్తులకు పూజ, జప నామ పారాయణలు అత్యంతావశ్యకాలు, నామసహస్ర పారాయణ అత్యంతావశ్యకమైన దనడానికి గల హేతువును వివరిస్తున్నాను.

పూర్వం భక్తులకు శ్రేయస్సును కలిగించాలనే దృష్టితో - వశిన్యాది వాగ్దేవతలను పిలిపించి శ్రీదేవి "ఓ వాగ్దేవతలారా ! నా మాటలను ఆలకించండి, మీరు నా అనుగ్రహం వల్ల సకల విద్యా సంపన్నులయ్యారు. కనుక నా భక్తులకు సకలవిద్యా సంప త్తులను ప్రసాదింప చేయడంలో సహకరించెదరు గాక ! శ్రీచక్ర రహస్యాన్ని గ్రహించిన మీరు నామ పారాయణయందు ఆసక్తి గల వారు కనుక, నా స్తోత్రాన్ని చేయవలసినదిగా ఆదేశిస్తు న్నాను. రహస్యాలతో కూడిన నా సహస్రనామ స్తోత్రాన్ని మీరు రచించాలి. ఏ స్తోత్ర పారాయణ మాత్రంచే నాకు శీఘ్రమే ఆనం దం కలుగుతుందో అట్టి స్తోత్రాన్ని చెయ్యండి" అని శ్రీదేవి చేత వశిన్యాది వాగ్దేవతలు ఆజ్ఞాపింపబడి రహస్యనామ సహ స్రాన్ని రచించారు. ఇదే రహస్యనామ స్తోత్రంగా విశేష ఖ్యాతి వహించింది. అనంతరం ఒకానొక సమయంలో సభలో సింహాస నాసీనయై ఉండగా వచ్చిన బృందారక సందోహానికి దర్శన

మిచ్చింది జగన్మాత. బ్రహ్మాణీ సమేతంగా బ్రహ్మాదిదేవతానీకం అనేకకోట్ల సంఖ్యలతో శ్రీదేవి సేవార్థం విచ్చేశారు. కోట్ల సంఖ్య గల లక్ష్మీనారాయణులూ, కోట్ల సంఖ్యగల గౌరీశంకరులూ విచ్చే శారు. మంత్రిణీదేవి, శ్యామలాంబ, దండనాయిక అయిన వారాహీదేవి అసంఖ్యాక నామరూపాలు గల శక్తులూ, జగన్మాత సందర్శనార్థం విజయం చేశారు. వారి సంఖ్య వర్ణనాతీతంగా ఉంది. దివ్యౌఘమైన బ్రహ్మాదులూ, సిద్ధౌఘమైన సనకాదులూ, మానవౌఘమైన వ్యాసాదులూ విచ్చేయగా ఆ సభలో అందరికీ శ్రీదేవి దర్శన మిచ్చింది. వచ్చిన దేవతలందరూ శ్రీ దేవిని సందర్శించి యథోచితాసనాలపై ఆసీనులుకాగా శ్రీ లలితాదేవి యొక్క కరుణా కటాక్షయుక్త నేత్రసంజ్ఞా ప్రేరితలైన వశిన్యాది వాగ్దేవతలు లేచి అంజలి బద్ధలై స్వవిరచిత సహస్రనామాలతో లలితాదేవిని స్తోత్రం చెయ్యసాగారు. వారి స్తోత్ర పాఠానికి జగ న్మాత పరమానందం చెందింది. సభాసదులందరూ మహాశ్చర్య మగ్నులయ్యారు.

అనంతరం సుఖాసీనులై ఉన్న అసురసమూహాన్ని గాంచి శ్రీదేవి "ఓ దేవతలారా ! వశిన్యాది వాగ్దేవతలు నా ఆదేశాను సారం ఈ స్తోత్రాన్ని రచించారు. నా ఆనందార్థం నా నామాలతో కూడిన ఈ స్తోత్రాన్ని మీరు సర్వదా పారాయణ చెయ్యాలి. ఇది నా ఆదేశం. సభ్యులారా : మీరు నా భక్తులలో ఈ స్తోత్రాన్ని ప్రచారం చెయ్యాలి. వారికి ఉపదేశించాలి. ఈ సహస్రనామాలను ఒక్కసారైనా పఠించే భక్తుడు నా అనుగ్రహానికి పాత్రుడవు తాడు. అట్టి వాని సర్వాభీష్టాలూ నెరవేరుతాయి. శ్రీ చక్రంలో

నన్ను పూజించి, పంచదశాక్షరీ మంత్రాన్ని జపించి, అనంతరం సహస్ర నామ పారాయణ చెయ్యాలి.

శ్రీ చక్రార్చన చేసినా, చెయ్యకపోయినా, మంత్రజపం చేసినా చెయ్యకపోయినా, నా ప్రీత్యర్థం సహస్ర నామాలను మాత్రం సదా పారాయణ చెయ్యాలి. అట్టి వారు నిస్సందేహంగా నా కరుణవల్ల సర్వాభీష్టాలనూ పొందుతారు,అందువల్ల నా సహస్ర నామాలను ప్రేమతో సదా పారాయణ చెయ్యాలి - అని పరివార యుకులగు సమస్త దేవతలకు లలితా పరమేశ్వరి ఆజ్ఞాపించింది.

శ్రీదేవి ఆజ్ఞానుసారం నాడు మొదలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులూ, శ్యామలాంబా శక్తులు యీ లలితా సహస్ర నామస్తోత్రాన్ని లలితాదేవి ప్రీతికై సదా పారాయణ చేస్తున్నారు. అగస్త్యమహర్షీ ! ముఖ్యంగా, ప్రతి భక్తుని చేతా యీ సహస్ర నామ స్తోత్రాన్ని పఠింప చెయ్యాలి. ఈ సహస్రనామ పారాయ ణావశ్యకతకు గల కారణాన్ని నీకు వివరించాను. ఇక సహస్ర నామాలను వర్ణిస్తాను, సావధాన చిత్తుడవై ఆలకించు" అన్నాడు.

## శ్రీ లలితా సహస్రనామస్తోత్ర ఫలశ్రుతి.

హయగ్రీవస్వామి తన శిష్యుడైన అగస్త్య మహర్షి ప్రశ్నానుసారం లలితా సహస్రనామ పారాయణ ఫలశ్రుతిని యీ విధంగా వివరిస్తున్నాడు.

ఓ అగస్త్యా : పరదేవతాస్తోత్రాలు రహస్య మయంగా ఉన్నాయి. అందులో అత్యంత రహస్యమైన, లలితాప్రీతికరమై

గతంలో చెప్పబడిన లలితా సహస్రనామాలు నీ కోసమే చెప్పాను. ఈ స్తోత్రం సమస్త అపమృత్యువులనూ కాలమృత్యువునూ కూడ పోగొట్టి, సమస్తజ్వరాలను నశింపజేసి, దీర్ఘమైన ఆయుర్దాయాన్ని లభింపచేస్తుంది,

దీనితో సమానమైన స్తోత్రం యిదివరలో చెయ్యబడిన స్తోత్రాలలో లేదు. ఇది శ్రీదేవి సంతోషాన్ని వృద్ధిచేస్తుంది. లలితాదేవి ఉపాసనయందు ఆసక్తిగలవారు శ్రద్ధాపూర్వకంగా ఈ స్తోత్రాన్ని పఠించాలి. ప్రాతః సమయంలో విధివిధానానుసారం వైదిక, తాంత్రిక సాధనలను పూర్తిచేసుకుని సంధ్యావందనాదులు నెరవేర్చుకొని, పూజాగృహంలో ప్రవేశించి శ్రీచక్రార్చన చేసి, శ్రీవిద్యా పంచదశాక్షరినిగానీ, షోడశాక్షరిగానీ, సహస్ర పర్యాయాలు. లేదా, మూడువందలసార్లు, లేదా, అష్టోత్తర శత పర్యాయాలు, జపం చేయాలి. ఆ తరువాత సహస్రనామ స్తోత్రాన్ని పఠించాలి. తన జన్మలో ఒక్కసారి అయినా యీ స్తోత్రాన్ని పారాయణ చేసే విద్వాంసుడు గంగాది పుణ్యనదులలో కోటిజన్మలలో స్నానంచేసిన ఫలాన్ని పొందుతాడు. అట్టివానికి కాశీ క్షేత్రంలో కోటి శివలింగాలు ప్రతిష్ఠచేసిన ఫలం లభిస్తుంది.పవిత్ర కురుక్షేత్రంలో సూర్యగ్రహణ కాలంలో కోటిపర్యాయాలు సమస్తమైన దానాలు చేసిన ఫలం లభిస్తుంది. విప్రశ్రేష్ఠులకు కోట్లకొలదీ సువర్ణదానాలు చేసినంత ఫలం లభిస్తుంది. జలరహితమైన ఊసర క్షేత్రంలో కోటినూతులను త్రవ్వించిన ఫలమూ, కరువు కాటక సమయాలలో కోటిమంది భూసురోత్తములకు సంతర్పణచేసినంత ఫలమూ లభిస్తుంది. అట్టి సంతర్పణలు శ్రద్ధగా వెయ్యి సంవత్స

రాలు ఎవరు చేస్తారో అట్టివారు పొందే పుణ్యాన్ని కోటి చేత గుణించగా వచ్చిన సంఖ్యగల పుణ్యాన్ని పొందుతారు.

ఈ రహస్యనామాలలో ఒక్కనామాన్నైనా సరే పఠిస్తే వెనుకచెప్పిన ఫలాన్ని పొందుతాడు. వాటిలో ఒక్క నామాన్నన్ని స్మరించినంత మాత్రాన మహాపాత కోపపాతకాలు నశిస్తాయి. విధిగా నిత్యం చేయవలసిన కర్మలు చేయనందువల్లా, చేయరాని పనులు చేసినందువల్లా కలిగే పాపాలన్నీ నశిస్తాయి. అధిక వర్ణన మేల! ఒక్కమాటలో చెబుతున్నాను విను. ఈ వేయి నామాలలో సమస్త పాపాలనూ నాశనంచేసే ఒక్క నామాని కున్నశక్తి చతుర్దశ భువనాలలో దేనికీలేదు. ఈ నామం పోగొట్ట జాలని పాపాలను పదునాలుగు లోకాలూ ఏకమైనా పోగొట్ట లేవు. ఈ నామం పోగొట్టలేని పాపాన్ని ఏదీ పోగొట్టలేదని తెలుసుకో. ఈ సహస్ర నామాలను విడనాడి పాపాలను నాశనం చేసుకో గోరువాడు శీత బాధను పోగొట్టుకో దలచి హిమవత్పర్వతం చేరిన వాడౌతాడు. నిత్యం యీ నామపారాయణ చేసే భక్తునికి శ్రీలలితాదేవి సంతసించి సమస్తాభీష్టాలనూ ప్రసాదిస్తుంది. ఈ నామపారాయణ చేయనివాడు భక్తుడెలా అవుతాడు. కావున నిత్యం పారాయణ చెయ్యాలి. నిత్యం పారాయణ చేయడానికి శక్తిలేకపోతే ఏ పుణ్య దినమందైనా పారాయణ జేయాలి. సంక్రాంతి, నవమి, చతుర్దశి, కృష్ణ పక్ష శుక్రవారాలందైనా దీనిని తప్పక పఠించాలి. విశేషించి పౌర్ణమినాడు పారాయణ చేయాలి. నాటి చంద్రమండలంలో లలితా మాతను ధ్యానించి ఈ సహస్రనామ స్తోత్రాన్ని పారాయణ చేయాలి. అని యీ విధంగా హయగ్రీవస్వామి ఫలశ్రుతిని

వివరించి నామ ప్రయోగవిధిని గురించి ఇలా విశదీకరిస్తున్నాడు.

కుంభసంభవా ! శ్రీలలితాదేవిని మానసోపచారాల ద్వారాపూజించి యీ స్తోత్రాన్ని పారాయణ చేస్తే సాధకుని సకల రోగాలు దూరమై అతడు దీర్ఘాయుర్దాయ సంపన్నుడవుతాడు. జ్వరగ్రస్తుని శిరస్సును స్పృశించి దీన్ని పారాయణ చేస్తే వెంటనే జ్వరం తగ్గిపోతుంది. శిరోవేదన కూడ తక్షణమే దూరమౌతుంది. ఈ స్తోత్రాన్ని పారాయణ చేసి భస్మాన్ని అభిమంత్రించి యిస్తే ఆ భస్మధారణ మాత్రంచేత సకల వ్యాధులూ నాశనమైపోతాయి. జలంతో నిండిన కలశాన్ని యీ సహస్రనామాలతో అభిమంత్రించి ఆ జలాలలో స్నానం చేయించినచో సకల గ్రహబాధలూ శాంతిస్తాయి. అమృత సముద్రమధ్యంలో విరాజిల్లే శ్రీ లలితాదేవిని ధ్యానిస్తూ యీ సహస్రనామాలనూ పారాయణ చేస్తే సమస్త విషాలూ పరిహరింపబడతాయి. సుపుత్ర ప్రాప్తి కొరకు గొడ్రాలుకు, యీ సహస్ర నామాలను పారాయణ చేస్తూ నవనీతాన్ని అభిమంత్రించి యిస్తే పుత్రప్రాప్తి కలుగుతుంది. తనకు ఇష్టమైన స్త్రీని దేవీ పాశంచేత బద్ధురాలుగా, అంకుశం చేత ఆకర్షింపబడిన దానినిగా, రాత్రివేళ ధ్యానిస్తూ యీ సహస్రనామాల్ని జపిస్తే అంతః పురాంగన అయినా, వాని సమీపానికి వస్తుంది.

రాజును వశంచేసుకో గోరేవాడు. రాజభవ నాభిముఖంగా ఆసీనుడై త్రిరాత్రులు యీ నామపారాయణ చేస్తే, ఆ రాజు గుర్రాన్ని గానీ, ఏనుగును గానీ ఎక్కి పరవశుడై ఉపాసకుని సమీపానికి వచ్చి దాసునివలె వశుడౌతాడు. అలా వశమైన రాజు

కోరిన ధనాన్ని గానీ, రాజ్యాన్ని గానీ యిస్తాడు. ఈ రహస్య నామ సహస్రాన్ని నిత్యపారాయణచేసే వ్యక్తి ముఖావలోకన మాత్రాన ముల్లోకాల వారూ మోహితులౌతారు.

ఈ లలితా సహస్రనామాలను ఒక్కసారి పారాయణ చేసిన భక్తుని శత్రు లను శరభేశ్వరుడు సంహరిస్తాడు. వీటిని పారాయణచేసే వానిపై ఎవడైనా ప్రయోగంచేస్తే ప్రత్యంగిరా, దేవి ఆ ప్రయోగాన్ని త్రిప్పికొట్టి, వానిని స్వయంగా సంహరి స్తుంది, ఈ సహస్రనామ పాఠకుణ్ణి ఎవరు క్రూర దృష్టితో చూస్తారో, వారిని మార్తాండ భైరవుడు అంధుల్ని చేస్తాడు. ఈ నామ పారాయణచేసే ఉపాసకుని ధనాన్ని హరించిన వాడు ఎక్కడున్నా క్షేత్రపాలకుడు వానిని నాశనం చేస్తాడు. దీనిని పారాయణ చేసే విద్వాంసునితో సభలలో ఎవరైనా వాదానికి దిగితే అట్టివారి వాక్కును నకులేశ్వరీదేవి స్తంభింపజేస్తుంది. ఈ నామపారాయణ పరునితో వైరం పూను రాజుయొక్క చతురంగ బలాలనూ వారాహీదేవి నశింపజేస్తుంది. ఆరుమాసాలకాలం ఎవరు దీన్ని పారాయణ చేస్తారో వారి యింట లక్ష్మిస్థిరంగా ఉంటుంది. నిత్యం మూడు పారాయణల వంతున నెల రోజులు ఎవరుచేస్తారో వారి జిహ్వాగ్రాన సరస్వతీదేవి నాట్యం చేస్తుంది. అనుదినం ఒక్కొక్క పారాయణ చొప్పున చేసే వాని దృష్టిపడే స్త్రీలు, మన్మథ పరవశలై వాణ్ణి మోహిస్తారు. జీవిత మధ్యంలో యీ సహస్ర నామాలను ఒక్కసారి అయినా పారాయణ చేసేవాని దృష్టికి కనిపించేవారు సమస్త పాప వినిర్ముక్తులవుతారు. ఈ నామ పారాయణపరులైన బ్రాహ్మణులకు అన్నవస్త్ర ధనధాన్యాది

దానాదులను చెయ్యాలి. అన్యులకు యివ్వరాదు. శ్రీ విద్యోపాసకు లెవరో, నిత్యం శ్రీచక్రాన్ని ఎవరు అర్చన చేస్తారో, ఎవరు యీ నామపారాయణ చేస్తారో వారు సత్పాత్రులని విద్వాంసులు చెబు తారు. శ్రీదేవీ ప్రీత్యర్థం ఎవరు ఏ దానం చేసినా దేవీభక్తులకు చేస్తే జగజ్జనని విశేషంగా సంతోషిస్తుంది.

శ్రీ విద్యోపాసనా రహితులు, యీ సహస్రనామ పారా యణ చెయ్యనివారు పశుతుల్యులని గ్రహించు. అట్టి వారికి చేసే దానం నిరర్ధకమైనది. వివేకంగల దాతలు దానం చేసేటప్పుడు పరీ క్షించుకొని శ్రీవిద్యా వేత్తలైన వారికి దానం చెయ్యాలి. లోకంలో శ్రీ విద్యతో సమానమైన విద్య లేదు. లలితాదేవితో సమానమైన దేవత లేదు. అల్లే యీ లలితా సహస్రనామ స్తోత్రంతో సమాన స్తోత్రం మరి లేదు.

ఈ సహస్రనామ స్తోత్రాన్ని లిఖించి సదా భక్తితో పూజించువారి యందు శ్రీదేవి సంప్రీతురాలవుతుంది. ఓ అగస్త్య మహర్షీ ! విస్తరించి వివరించ నేల ? సకల తంత్రాలలో ఈ లలితా సహస్రనామ స్తోత్రంతో సమానమైన స్తోత్రం లేదు. అందువల్ల శ్రీ విద్యోపాసకుడు ఈ స్తోత్రాన్ని శ్రద్ధగాపఠించాలి.

ఈ లలితా సహస్రనామాలు పఠించి శ్రీ చక్రాన్ని పద్మా లతో కానీ, తులసీదళాలతో, అరుణోత్పలాలతో కానీ దీపకుసు మాలతో గానీ, సంపెంగపూలతో కాని, జాజిపూలతో లేదా మల్లె పూలతో గానీ, గన్నేరు పూలతో, లేదా నల్ల కలువలతో, లేదా మారేడు దళాలతో, మొల్ల పొగడ, పొన్న కలిగొట్టు, మొగలి

గురువిందాది యితరేతర సుగంధ సుమాలతో దేనితోనయినా ఒక్క పర్యాయం ఆరాధిస్తే అట్టివానికి కలిగే ఫలాన్ని వర్ణించ డానికి పరమశివుడంత వానికి కూడ శక్యంకాదు. శ్రీ చక్రార్చనా ఫలాన్ని శ్రీ లలితాదేవి మాత్రమే గ్రహించగలదు.

ప్రతి మాసంలోను పూర్ణిమా దివసాన రాత్రివేళ చంద్రో దయ సమయంలో సహస్రనామాలతో శ్రీ చక్రార్చన చేసేవాడు లలితా స్వరూపుడు. శ్రీ చక్రార్చన చేసే శ్రీ విద్యోపాసకునికీ, శ్రీ లలితాదేవికినీ యీషణ్మాత్ర భేదమైనాలేదు. వారిని భేద భావంతో చూసేవారు సర్వపాపాలు ఆచరించిన వారవుతారు. శర త్కాలంలో, ఆశ్వయుజమాసంలో శుక్లాష్టమీ నవముల నాడు శ్రీచక్ర మధ్యవిరాజామానమగు శ్రీ లలితాదేవిని యీ సహస్ర నామాలతో అర్చించే వారికి ముక్తి కరతలామలక మవుతుంది.

శుక్రవారంనాడు శ్రీచక్రంలో లలితాదేవిని సహస్ర నామా లచే పూజచేసే వాని పుణ్యాన్ని ఆలకించు. ఈ జన్మలో సమస్త సంపదిలూ కలవాడై. సర్వాభీష్టాలనూ పొంది, పుత్ర పౌత్రాదు లతో సకల భోగాలనూ అనుభవించి, అవసానకాలంలో శివాదు లచే కూడా కోరదగిన దుర్లభమగు శ్రీ లలితాదేవి సాయుజ్యాన్ని పొందుతాడు. ఈ సహస్ర నామాలతో గంధ, పుష్ప, ధూప, దీపారతో బ్రాహ్మణ సహస్రాన్ని పూజించి ఆయా నామదేవత లనుగా వారిని భావించి, షడ్రసోపేత భోజనంతో, దక్షిణ తాంబూ లాదులతో సంతృప్తులను చేస్తే వారికి శ్రీ లలితాదేవి సామ్రా జ్యాన్ని ప్రసాదిస్తుందని గ్రహించాలి. అట్టి సాధకునకు ముల్లో

కాలలో దుర్లభమయిన వస్తువన్నది ఉండదు, నిష్కామంగా పారాయణచేస్తే బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. ధనార్థియై పఠిస్తే ధన సంపన్నుడవుతాడు. కీర్తికాముకుడు కీర్తిని పొందుతాడు. విద్యాభిలాషి విద్యను పొందుతాడు, భోగ,మోక్షాలను ప్రసాదించు నట్టి యీ సహస్ర నామస్తోత్ర సదృశ స్తోత్రం మరి ఒకటిలేదు.

భోగమోక్షార్థులు అవశ్యం దీనిని పారాయణ చేయాలి. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమవాసులలో ఎవ రైనా దీనిని పారాయణ చేయవచ్చును. తమ ఆశ్రమ ధర్మాల లోపాలను పూర్తి చేసికోవడానికి చతురాశ్రమాల వారూ దీనిని పారాయణ చెయ్యాలి. పాపకర్మాసక్తి,పుణ్యకర్మలయందు అశ్రద్ధా కల యీ కలియుగంలో మనుష్య మాత్రులకు లలితా సహస్ర నామ పారాయణకంటె తరణోపాయం వేరొకటి లేదు. లోక వ్యవహారాలను గురించి మాట్లాడడం కంటె, ఒక విష్ణు నామ సంకీర్తనం శ్రేష్ఠమైనది. విష్ణు సహస్ర నామ సంకీర్తనం కన్నె ఒక శివనామసంకీర్తనం శ్రేష్ఠమైనది. శివనామ సహస్ర పారా యణ కన్న ఒక్కదేవీ నామ సంకీర్తనం శ్రేష్ఠమయింది.

ఓ అగస్త్యమహర్షీ ! దేవీ సహస్రనామస్తోత్రాలు అనంత సంఖ్యల్లో రాజిల్లుతూన్నా అవి అసంఖ్యాక శక్తుల సంప్రీతికోసం ఉత్పన్నమయ్యాయి. వాటిలో దశవిధశక్తి స్తోత్రాలు మాత్రం విఖ్యాతిగాంచాయి. గంగా భవాని, గాయత్రి,కాళి, లక్ష్మి,సరస్వతి, రాజరాజేశ్వరి, బాల, శ్యామల, లలిత యీ దశ దేవతల సహస్ర నామ స్తోత్రాలూ ఉత్తమమైనవి. ఉపర్యుక్త దశవిధ సహస్ర

నామాలలో యీ లలితా రహస్యనామ సహస్రస్తోత్రం సర్వశ్రేష్ఠ మయింది. కావున కలిదోష సర్వస్వ నిర్మూలనార్థం నిత్యం దీనిని పారాయణ చెయ్యాలి. అజ్ఞానవశులైనవారు శ్రీదేవి నామ మాహాత్మ్యాన్ని గ్రహించలేక కొందరు విష్ణునామ పరాయణులు గానూ, మరికొందరు శివనామ పరాయణులుగాను ఉంటున్నారు. అన్నిటికంటె ఇహపర సాధనకు లలితా సహస్రనామాలు శ్రేష్ఠమై నవి. కాని, లోకంలో ఎవరికీ వీటియందు శ్రద్ధలేదు. కోటి జన్మ లతో అన్యదేవతానామ పారాయణచేసే వారికే యీ జన్మలో శ్రీ లలితానామ పారాయణయందు శ్రద్ధ కలుగుతుంది. చరమ జన్మ యందు శ్రీవిద్యోపాసన లభించునట్లే లలితానామపారాయణయందు కూడ శ్రద్ధ కలుగుతుంది. వీరిరువురికీ పునర్జన్మ లేదు. లోకంలో శ్రీ విద్యోపాసకులు అత్యల్ప సంఖ్యలో ఉన్నట్లుగానే యీ నామ పారాయణ యందు శ్రద్ధకలవారు కూడ అత్యల్పంగానే ఉన్నారు. శ్రీ విద్యోపాసన, శ్రీ చక్రార్చన, రహస్యనామ పారాయణ, అల్ప తపస్వులకు లభించవు మహాతపః ఫలం వల్లనే యీ మూడూ లభిస్తాయి. నేత్రాలు లేనివాడు రూపాన్ని చూడబోయి నట్లే ఈ నామసహస్రాన్ని పారాయణ చెయ్యక, శ్రీదేవికి సంతోషాన్ని కలుగచెయ్యడానికి ప్రయత్నించి నట్లవుతుంది. ఈ రహస్యనామ పారాయణ లేక మంత్ర సిద్ధిని కోరేవాడు. భోజన రహితంగానే ఆకలిబాధను పోగొట్టుకోదలచినవాడౌతాడు. లలితా భక్తుడైనవాడు నిత్యం యీ రహస్య నామపారాయణ చెయ్యాలి. దీన్ని విడనాడి కోట్లకొలది కల్పాలవరకూ ఇతరేతర పుణ్యాలు ఎన్ని చేసినా శ్రీదేవి అనుగ్రహాన్ని పొందలేడు. అందువల్ల దేవీ భక్తులు శ్రద్ధతో యీ రహస్య నామాలను పారాయణ చెయ్యాలి.

ఓ అగస్త్య మహర్షీ! ఈ రహస్యమైన లలితా సహస్ర నామాల్ని స్తోత్రాన్ని నీకు చెప్పాను. శ్రీ దేవీ ఉపాసన లేనివారికి భక్తిహీనులకు, నువ్వెన్నడు దీనిని ఉపదేశించకు. శ్రీవిద్య గోప్య మైన రీతిగనే యీ రహస్య నామానిను కూడ గోప్యంగా ఉంచాలి. పశుతుల్యులకు ఎంతమాత్రం ఉపదేశించరాదు. మూఢుడై దీనిని శ్రీవిద్యారహితులకు ఉపదేశిస్తే అట్టివానిపై యోగినులకు ఆగ్ర హం కలుగుతుంది. అట్టివాడు మహానర్థకారి అవుతాడు. అందు వల్ల యీ రహస్యనామ స్తోత్రాన్ని గుప్తంగా ఉంచాలి. నేను స్వతంత్రించి నీకు కూడ చెప్పలేదు. కేవలం శ్రీదేవి ఆదేశాను సారమే ఉపదేశించాను. కనుక నువ్వు సంపూర్ణంగా యోచించిన మీదటనే సత్పాత్రులైన వారికి మాత్రమే నువ్వు దీనిని ఉపదే శించాలి.

ఓ అగస్త్యమహర్షీ! నీవు యీ లలితా సహస్రనామ స్తోత్రాన్ని పఠిస్తే శ్రీదేవి సంతసించి నీకు సర్వ శుభాలనూ చేకూర్చుతుంది, అని చెప్పి హయగ్రీవస్వామి శ్రీదేవిని ధ్యానించి నంతనే పులకితగాత్రుడై బ్రహ్మానందాన్ని పొందాడని సూత మహర్షి ఋషులకు చెప్పాడు.

* ఫలశ్రుతి సమాప్తం *

# మణిదీప వర్ణన

వేదవ్యాసమహర్షి ప్రణీతమయిన దేవీ భాగవతాంతర్గత పాఠానికి అనువాదము.

బ్రహ్మలోకానికి వుపరిభాగంలో సర్వలోకం వుంది. వైకుంఠ, కైలాస, గోలోకాది లోకాలకన్న అది మిన్నయై విరాజిల్లు తున్నది. కనుకనే దానికి సర్వలోకనామం సార్థకమయింది. పరమేశ్వరి దానిని తన సంకల్ప మాత్రం చేత సృష్టించింది, అంత అందమయిన లోకం మరెక్కడా లేదు. అది బ్రహ్మాండ సర్వస్వానికీ ఛత్రం వలె అమరి వుంది. ఆ సర్వలోకమే మణిద్వీపము. అనేక యోజనాల పొడవు వెడల్పులతో తేజరిల్లే ఆ మణిద్వీపం చుట్టూ అమృత సాగరం ఉంది. అది నిర్విరామంగా తుంపరలను వెదజల్లుతూన్న తరంగాల సముదాయంతో, రత్న వాలుకలతో, నిర్మల శంఖ, మత్స్యాదులతో, పతాకశోభిత నౌకల సమూహంతో మనోహరంగా భాసిల్లుతున్నది. దాని తీరంలో అసంఖ్యాక రత్న వృక్షాలు వున్నాయి. వాటి కావల ఆకాశమంత యెత్తులో సప్త యోజనాలు వెడల్పా పొడవూగల లోహమయ ప్రాకారముంది. దానికి నల్దిశలలోను నాలుగేసి వంతున ద్వారాలూ, బురుజులూ ఉన్నాయి. ఆ ప్రాకారాన్ని ఆవరించి సాయుధపాణులైన రక్షకభటులు పహరా యిస్తూ అర్బుదాల సంఖ్యలో వున్నారు. ద్వారానికి నూరు చొప్పున దౌవారికులుంటారు. ప్రాకార ప్రాంగణంలో పరమేశ్వరిని సందర్శించాలని అశ్వ, గజ, విమానాదులపై విచ్చేసిన అమర గణాలతోను, వారి వాహనాలకు సంబంధించిన గంటల గణగణ రావాలతోను. వారి

వారి గుసగుసలతోను గజ ఘీంకారాలతోనూ, హయహేషల తోనూ, శీతలోదక సంభరిత స్వచ్ఛ జలాలతో నిండిన సరో వరాలతోను "ఊరుకోండి, నిశ్శబ్దంగా వుండండి. మాట్లాడకండి. మీకే చెబుతూన్నది. వినిపించడం లేదా ?" అంటూ హెచ్చరి స్తూన్న రక్షకభట సందోహాలతో కర్ణభేరీలు ప్రతిధ్వనించేటట్లు దశదిశలూ మారుమ్రోగేటట్లు వుంటుంది ఆ వాతావరణము.

దానిని దాటగా దర్శనమయ్యేది కాంస్య ప్రాకారము. అది కూడా ఆకాశాన్ని అంటుతూ ఏడు యోజనాల వెడల్పు కలిగి గోపురద్వారాలతో కనులు మిరుమిట్లు గొలిపే స్థాయిలో మెరిసి పోతూంటుంది. దానిని పరివేష్టించి పనస, మామిడి, అరటి, ద్రాక్ష, ఖర్జూర, నిమ్మ, కొబ్బరి, నారింజ, తాల, తమాల, తక్కోల, హింతాల, సాల, కదంబ, పున్నాగ, చంపక, అశోక, చందన, హరిచందన, మందార, కోవిదారాది వనాలూ, తులసీ బిల్వవనాలూ వున్నాయి, అవి భ్రమర నాదాలతో శుకపికశారి కాది పక్షి సంతతులతో, పరుగుతీసే లేళ్ళ గుంపులతో, సుగంధా లతో నయన మనోహరంగా వున్నాయి.

అది దాటగా ఉపర్యుక్త ప్రాకార సదృశ ప్రమాణం కలిగి అభేద్యమైన తామ్రప్రాకారం చతురస్రంగా వున్నది. దాని నావరించి ఫల పుష్ప సంభరిత కల్పతరు వనాలు అగణితంగా వున్నాయి. వాటి ఫల బీజాలన్నీ రత్నాలే పుష్ప సుగంధం దశ యోజన పర్యంతం వ్యాపిస్తూంటుంది. ఆ వృక్షాలూ, ఫలాలూ, పుష్పాలూ సువర్ణచ్ఛాయలో వుంటాయి. పుష్ప చ్ఛత్రాలతో పుష్పా

భరణాలతో, పుష్ప మధువును పానంచేసి నిమీలిత నేత్రాలతో పుష్ప సింహాసనాసీనుడై వసంతుడు అక్కడే విరాజిల్లుతూంటాడు. మధుశ్రీ మాధవశ్రీలు అతని భార్యలు. వారు అతిలోక సౌందర్య మూర్తులు. వారు తమ నాథుణ్ని సేవిస్తూ విరాజిల్లుతుంటారు. సుమనోహరమైన ఆ వనమందలి పుష్పగుచ్ఛాల నుండి మధువు స్రవిస్తూంటుంది. గండు కోయిలల కుహూ కుహూ నాదాలతో కల కల లాడుతూ వుంటుంది - అక్కడ వసంత లక్ష్మి.

వీణా వేణు మృదంగాది వాద్య విశేషాలతో గంధర్వులు ఆడుతూ పాడుతూంటారు. ఆ ప్రదేశాలన్నీ కాముకుల కామో ద్రేకాన్ని ద్విగుణీకృతం చేస్తుంటాయి.

ఆ తామ్ర ప్రాకారం దాటితే సీస ప్రాకారం వస్తుంది. అది కూడ వుపర్యుక్త ప్రాకార సదృశ ప్రామాణ్యం కలిగి విరాజిల్లుతూంటుంది. అచ్చటి సంతాన వృక్ష పంక్తులలోని పువ్వుల వాసనలు దశయోజన పర్యంతం సుగంధాన్ని వ్యాపింప జేస్తుంటాయి. వాటి ఫలాలు అమృతాన్ని వర్షింపజేస్తుంటాయి. ఆ తరువుల పత్ర పుష్ప ఫలాదులన్నింటికన్నీ సువర్ణమయాలే. లోక తాపాన్ని రూపుమాపగల ఆ వనాలలో సుగంధాన్నీ సుమమాల లనూ ధరించిన సిద్ధ, విద్యాధరాది దేవజాతుల వారెందరో విహ రిస్తూ క్రీడిస్తూంటారు. అక్కడ గ్రీష్మ ఋతు నాయకుడు శుక్రశ్రీ, శుచిశ్రీ అనే తన భార్య లిద్దరితో ఉంటాడు. అతని ప్రియురాం(డతనికి వింజామరలు వీస్తుంటారు. చల్లటి నీటి తుంప రలతో ఆ వనాలు హాయిని చేకూరుసుంటాయి. ఆ మనోహర

ప్రదేశం కనులారా చూడవలసిందే కానీ వర్ణించ తగినది మాత్రం కాదు.

దానికి ఆవల పూర్వవర్ణిత ప్రాకార ప్రామాణ్యం కల యిత్తడి ప్రాకారం వుంది. దాని యెత్తు, వెడల్పూ కూడ సప్త యోజనాలే దానిని ఆవరించి హరిచందన వనాలున్నాయి. అక్కడ మేఘాలకు నాయకుడు విద్యుత్ పింగళ నయనాలతో, జీమూత కవచంతో, అశనిపాత ధ్వనులతో, ఇంద్రచాపంతో, వర్షఋతు నాయకుడు భాసిల్లుతూంటాడు. అతడు అసంఖ్యాక వర్షధారలను వర్షింపజేస్తుంటాడు. అతని భార్యలైన నభశ్రీ, నభస్సశ్రీ, స్వరస్యా, అరస్యమాలినీ, అంబాదుల, అనిరత్న, అభ్రమంతి, మేఘమంతి, వర్షమంతి, చిపుణిక అనే వారలు అతణ్ణి సేవిస్తూంటారు. ఆ ప్రదేశాలు పచ్చని బయళ్ళతో, సరిక్రొత్తని వృక్షాలతో, లతలతో, అరుణ వర్ణ ఫల సంభరితమై ప్రవహిస్తున్న నదీనదాలతో నయనానందకరంగా వుంటాయి. విరాగి హృదయ సదృశంగా అరుణవర్ణ జలాలతో తటాకాలు శోభిల్లుతూంటాయి. దేవతలూ, సిద్ధులూ అక్కడ బాసిల్లుతూంటారు.

ఆ ప్రాకారం దాటితే పంచలోహ ప్రాకారం తేజరిల్లుతూంటుంది. వివిధ లతాగుల్మాదులతో పూపొదరిండ్లతో మందార తరువనాలు అక్కడ కనులవిందుగా గోచరమవుతాయి. ప్రియాంగనలతో సిద్ధగణాలు విహరిస్తుంటాయి. అక్కడే శరదృతు నాయకుడు ఇష్టలక్ష్మి, ఊర్జలక్ష్మి అనే పత్నులతో నివసిస్తూంటాడు. దానిని అధిగమించి రజిత ప్రాకారం పురోగమించగా అంబ

రాన్ని చుంబిస్తు కనిపిస్తుంటుంది. పుష్పగుచ్ఛాలతో, పారిజాత వనాలు యెన్నో దానిని పరివేష్టించి వున్నాయి. దశయోజన పర్యంతం ఆ పుష్పసుగంధం వ్యాపిస్తుంటుంది, దేవీ భక్తులూ, దేవీ సేవాపరాయణులు అక్కడుంటారు. నిజాయుధాలతో హేమంత ఋతు నాయకుడు అక్కడే సహశ్రీ సహస్యశ్రీ అనే భార్యలతో రాగులను రంజింపజేస్తూంటాడు. ఈ ప్రాకారం దాటి పురోగమిస్తే సువర్ణమయ ప్రాకారం భాసిల్లుతూంటుంది. దాని నావరించి పుష్పపల్లవాదులతో కదంబవనాలున్నాయి. దేవీ ప్రీత్యర్థం గోదానాలు చేసిన పుణ్యాత్ములు అక్కడ కదంబ మధువును పానం చేసి ఆనందమగ్నులై వుంటారు. శిశిర ఋతు నాయకుడు తపశ్రీ, తపస్యశ్రీ అనే భార్యలతో అక్కడుంటాడు. ఆ కదంబ వనాలలోనే మహా సిద్ధులయినవారు కుటుంబ పరివారాలతో స్వర్గ భోగాలను మించిన సుఖాలను అనుభవిస్తూ ప్రకాశిస్తుంటారు.

పూర్వ వర్ణిత ప్రాకార సదృశంగానే యీ ప్రాకారానికి అవతల పుష్యరాగ ప్రాకారం ఉంది. ఆ ప్రాకారాన్ని ఆవరించి వున్న భూమి, తరు, వనలతా, విహంగ, మండప, మండప స్తంభ సరోవర, తదంతర్గత పద్మాదులన్నిటికన్నీ పుష్యరాగమణి సదృశవర్ణంతో తేజరిల్లిపోతుంటాయి. ఆ ప్రాకారానికి అష్ట దిశలలో బ్రహ్మాండ సంరక్షకులు. అష్టదిక్పాలురు, నిజవాహన ఆయుధ, పత్ని, భటసమూహ, పరిచారక, బంధుపుత్రాదులతో సర్వకార్యాలను సర్వ సమర్థంగా నిర్వహించుకొంటారు. ఐకమత్యంగా వ్యవహరించడం వారి సహజ లక్షణము.

ఈ ప్రాకారానికి ఆవల వున్నది పద్మరాగ ప్రాకారము అది పది యోజనాల పొడవూ, అంతే వెడల్పు కలిగి కుంకుమలా యెర్రగా వుంటుంది. అందలి గోపుర, ప్రాంగణ, శతాధిక మండపాదులన్నింటికన్నీ ఆ మణి వర్ణంతోనే ప్రకాశిస్తూంటాయి. పింగళాక్షీ, విశాలాక్షీ, సమృద్ధి, వృద్ధ, శ్రద్ధా, స్వాహా, స్వధా, మాయా, సంజ్ఞా, వసుంధరా, త్రిలోకధాత్రీ, సావిత్రీ, స్కంద మాతా, అచ్యుతప్రియ, విమల, అమల, తరుణి, ప్రకృతి వికృతి, సృష్టి స్థితి, సంహృతి, సంధ్యా మాతా, సతీ, హంసీ, మర్దిక, పరా, దేవమాత, భగవతి, దేవకి, కమలాసన, త్రిముఖి, సప్తముఖి, సురాసుర విమర్దిని, లంబోష్టి, ఉర్ధ్వకేశి, బహుశీర్ష, వృకోదరి, రథరేఖ, శశిరేఖ, గగనవేగ, పవనవేగ, భువనపాల, అనాతర, అనంగమదన, అనంగ మేఖల, అనంగకుసుమ, విశ్వ రూప సత్యవాదిని, బహురూప, శుచివ్రత, వుదార, వాగీశ, అగ్ని, క్షయంకరి, శక్తి రక్షాసురాది చతుఃషష్టి కళలు, భయంకర వదనా లతో, రక్తనేత్రాలతో, శంఖ, చక్ర, ధనుర్బాణాలతో యుద్ధ పరికరసర్వస్వంతోగజాశ్వరథ విమానాదులతో అక్కడేవుంటారు. "మా ప్రభావాన్ని చూడండి. బ్రహ్మాండ భాండాలను చూర్ణంచేసి వేస్తాము. వాయువును స్తంభింపజేస్తాము. యావద్విశ్వాన్నీ కబ శించివేస్తాము. సాగర సలిలాలను పానంచేసి వేస్తాము. సూర్య చంద్రాదులను వూడబెరికివేస్తాము. మా శక్తి సామర్థ్యాదులను తిలకించెదరు గాక :" అంటూ వికటాట్టహాసాలు చేస్తూ, విస్ఫు లింగాలను వర్షింపజేస్తూంటాయి ఆ శక్తులు. వాటిలో ఒక్కొక్క దానికి అసంఖ్యాక అక్షౌహిణీ సేనలున్నాయి. అగణిత బ్రహ్మం

డాలను ఒక్కొక్క శక్తి నాశనం చేసివేస్తుంది. వాటి ప్రగల్భాట్ట హాస శ్రవణ మాత్రంచే హృదయాలు ప్రకంపించి పోతుంటాయి.

ఈ ప్రాకారం దాటివెడితే గోచరమయ్యేది గోమేధిక ప్రాకారము. అదికూడ పద్మరాగ ప్రాకార సదృశ ప్రామాణ్యం లోనేఉంటుంది.అచ్చటి భూ,మండప,తరు,సరోవరాదులన్నిటికన్నీ గోమేధికమణి సదృశ వర్ణాలే. అక్కడ ముప్పైరెండు శక్తులు గోమేధిక మణిమయాలంకారాలతో, పిశాచ వదనాలతో, అరుణ నేత్రాలతో "ఖండిస్తాం-చీల్చివేస్తాం-పొడచేస్తాం-కాల్చివేస్తాం" అంటూ అరుస్తూంటారు. వాటికి వేర్వేరు లోకాలున్నాయి. శస్త్రా స్త్రాలు సర్వదా వాటి దగ్గరే ఉంటాయి.

స్వర్గవాసులయినవారు సదా ఆ శక్తులను ఆరాధిస్తుంటారు. అవి యుద్ధాన్నే వాంఛిస్తూంటాయి. అందులో ప్రతి శక్తికీ పది పదునైదు అక్షౌహిణీల సైన్యాలున్నాయి. అవి ధరించే ఆయుధ వాహనాలు గణనాతీతాలు. యుద్ధమన్నమాట వినిపిస్తే చాలు అవి మహోత్సాహంతో లేస్తాయి.

వాటి నామాలు - ప్రజ్ఞ, సినీవాలి, కుహూ, రుద్ర! వీర్యా! ప్రభ! నంద! పోషిణి! బుద్ధిద! కాళరాత్రి! భద్రకాళి! కపర్దిని! వికృతి దండి! ముండిని: ఇందుఖండ! శిఖండిని! నిశుంభ! శుంభ మర్దిని! మహిషాసురమర్దిని! ఇంద్రాణీ! రుద్రాణి! శంకరార్ధశరీరిణి నారాయణి! త్రిశూలిని! అంబికహ్లాదిని! అయి వున్నాయి. ఈ నామాలను స్మరించినంత మాత్రాన పాపాలు నాశనమైపోతాయి. పుష్టి కలుగుతుంది.

గోమేధిక ప్రాకారాన్ని అధిగమించి ముందుకు వెడితే- పది యోజనాలయెత్తూ, అంతే వెడల్పూ గల వజ్ర ప్రాకారం వున్నది. అచ్చటి భూమి, గోపుర గోపురద్వార, కవాట, గృహ, వీధి, వృక్షమృగ, సరోవర, కూపాదులన్నీ వజ్రమయాలు. పరిచారికా పరివేష్టితురాలైన శ్రీ భువనేశ్వరీదేవి అక్కడే విరాజిల్లుతూంటుంది. ఆ సేవికలలో కొంద రామెకు వింజామరలతో వీవెనలు వీస్తుంటే మరికొందరు కర్పూర తాంబూలాదులు యిస్తునూ, కొందరు ఛత్రాలను పడుతూనూ, కొందరు పూల మాలలను సమర్పిస్తూనూ, మరి కొందరు సింధూర తిలకాలను దిద్దుతూనూ, కొందరు పాదసేవ చేస్తూనూ వుంటారు. ఈ సేవికలలో ముఖ్యులు :— అనంగరూప, అనంగమదన, మదనాతుర, భువనవేగ, భువనపాలిక, సర్వశిశిర, అనంగవేదన, అనంగమేఖలలు, వీరందరో మదోన్మత్త మంజు మంజీరాద్యాభరణాలంకారాలతో విద్యుల్లేఖలవలె మెరిసిపోతుంటారు. వెండిబెత్తాలు ధరించి అందరినీ హెచ్చరిస్తుంటారు. సర్వ కార్యాలనూ సమర్ధవంతంగా నిర్వహిస్తూ శ్రీ భువనేశ్వరీ దేవికి చూపుతూంటారు. వీరిలో ఒక్కొక్కదానికి అనేక మంది దాసీలుంటారు. వారు తమ యజమానురాలిని శ్రద్ధాభక్తులతో సేవించుతుంటారు. ఈ దాసీల గృహాదులు యీ ప్రాకారానికి ఆవలి భాగంలో అష్టదిశలలో వున్నాయి.

ఈ వజ్ర ప్రాకారం దాటి ముందుకు వెడితే కన్నుల విందుగా అత్యంత సుందరంగా కనిపించేది వైడూర్య ప్రాకారము. ఇది అసంఖ్యాక గోపుర ద్వారాలతో తేజరిల్లుతూంటుంది.

ఇక్కడి వీధులూ గృహవాపీకూపతటాక, నదీనదాదులన్నీ వైడూర్య మణిమయాలే. ఈ ప్రాకారం యొక్క అష్టదిశల యందూ నిఖిల బ్రహ్మాండాలనూ సంరక్షిస్తూ బ్రాహ్మీ! వారాహీ! మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, యింద్రాణీ, చాముండా,మాతృకా సప్తకమూ, మహాలక్ష్మి, వారివారి పరివారాలతో స్వస్థానాలలో వుంటారు. ఈ ప్రాకారానికి చతుర్ద్వారాలలో విశేషాలంకృతాలైన గజాశ్వాలూ, సింహ, వ్యాఘ్ర గరుడ మయూర, వృషభ, చిత్రాతిచిత్ర విమాన, రథాదులూ అసంఖ్యాకంగా వున్నాయి. అసంఖ్యాకంగా రక్షకభటులు అక్కడ "హారాహుషార్" అంటూ సావధానంగా వుంటారు. ఆ కోట చుట్టూ అసంఖ్యాక పతాకాలు చిత్ర విచిత్ర వర్ణాలు కలిగి అంబరాన్ని చుంబిస్తూ రెప రెప లాడుతూంటాయి.

ఈ ప్రాకారం దాటగానే దశయోజనాల యెత్తుతో అంతే వెడల్పు కల ఇంద్రనీల ప్రాకారం కనుల ప్రతిబింబిస్తుంది. దానిని పరివేష్టించి భాసిల్లుతూన్న రాజవీధులు, గృహారామాలూ, దిగుడుబావులూ, రథ్యలూ, భూమి ఆదిగా గల వన్నిటికన్నీ యింద్రనీలమణిమయాలే: అచ్చట విశేష వైశాల్యం కలిగిన పద్మం వుంది. దానికి పదునారు దళా లున్నాయి. సుదర్శన చక్ర సన్నిభంగా అది భాసిల్లిపోతూంటుంది, దాని దగ్గర కరాళీ వికరాళి వుమ సరస్వతి శ్రీ దుర్గ ఉష లక్ష్మి శ్రుతి స్మృతి ధృతి శ్రద్ధ మేధ మతి కాంతి రాయ ఛాయ - అనే షోడశశక్తు లుంటాయి. ఇవి కాల వర్ణంతో అనంతాయుధ వాహనాదులతో - భువనేశ్వరీదేవి యుద్ధ సైన్యాలను నడుపుతూంటాయి. యుద్ధో

త్సాహం విశేషంగా కల వీటి బలపరాక్రమాదులను సహస్రశీర్షు డయినా వర్ణింప లేడు.

దీనిని దాటితే గోచరించేది - దశయోజనాలు పొడవూ వెడల్పూ గల ముత్యాల ప్రాకారము. అచ్చటి భూములు, మందిరాలు అన్నిటికన్నీ ముత్యాలమయాలే. ఆ ప్రాకార మధ్య దేశంలో ముత్యాల కేసరాలతో, మంత్రిణులు అక్కడే వుంటారు. వారు సావధానలై యెప్పటికప్పుడు విశ్వ వార్తలలోని గుణాగుణాలను విమర్శించి భువనేశ్వరికి నివేదించు కుంటూంటారు. విదుషీమణులు, పరాంగితజ్ఞాతలు, కుశాగ్రచిత్తులు, చతురశీలురు అతి సౌందర్యవతులు, కార్యకుశలురు, జ్ఞానసంపన్నులు అయిన వారి నామావిలి :- అనంగమదన, అనంగమదనాతుర, భువనపాల, గగనవేగ శశిరేఖ గగనలేఖ, అనంగకుసుమ, అనంగ కుసుమాతుర-వీరందరూ అరుణ వర్ణంతో ప్రకాశిస్తూంటారు.

ఈ ప్రాకారం దాటితే మకరతమణి ప్రాకారం దృగ్గోచరమవుతుంది. అచ్చటి భూమి, వీధులు, మందిరాలూ అన్నీ మరకత మణిమయాలే. అది దశయోజనాల వెడల్పుతో అంతే పొడవు కలిగి ఉంటుంది. అక్కడ భోగ భాగ్యాలకు లోటే వుండదు. దాని మధ్యభాగంలో షట్కోణయంత్రం వుంది. ఆ కోణాలలో క్రమంగా గాయత్రీ, సావిత్ర్యాదులూ, బ్రహ్మవిష్ణు రుద్రాగ్ని కుబేర వరుణ మన్మథ వినాయకాదులూ నిజపరివార, వాహనాదులతో వారి పత్నుల రూపాలతో భాసిల్లుతూంటారు. వేదశాస్త్ర పురాణాదులు గాయత్రినీ చతుషష్ట్యాగమాలూ, శ్రీ మహాలక్ష్మీ దేవిని నవనిధులూ రూపుదాల్చి సేవిస్తూంటాయి.

దాని కావల వున్నది ప్రవాళ ప్రాకారము. ఎర్రటి కుంకుమ వర్ణం కల దాని పొడవూ, వెడల్పూ కూడ శతయోజనాలే. దాని పరిసర, మధ్య ప్రదేశాలూ, అందలి భవనాలూ అన్నిటికన్నీ ప్రవాళ [ పగడం ] మయాలే. పంచమహాభూతాలకూ అధికారులు అయిన హృల్లేఖ, గగన రక్ష, కరాళిక, మహోచ్ఛుష్మ లైదుగురూ కోటమధ్యభాగంలో పంచభూతాలవంటి కాంతితో ప్రకాశిస్తూంటారు. విశేష భూషణాద్యలంకారాలతో పాశాంకుశ వరాభీత ఆయుధపాణులై నవయౌవ్వన గర్వంతో భువనేశ్వరీ సదృశ స్వరూపాలతో వారు భాసిల్లుతూ ఉంటారు. దానిని దాటివెడితే కనుపించేది విశేష వైశాల్యం కల నవరత్న ప్రాకారము. అందలి సరోవర మందిరాదు లన్నిటికన్నీ నవ రత్న మయాలే. దాని మధ్యభాగంలో ఆమ్నాయ దేవతలు రాజిల్లుతూంటారు. వారి భవనాలు కూడ అసంఖ్యాకంగా ఉన్నాయి. శ్రీదేవీ అవతార మూర్తులూ మహావిద్యలూ, సప్తకోటి మహామంత్రాలూ వాటి అధిష్టాన దేవతలూ, దేవీభూషణ వాహనాదులూ అసంఖ్యాక సూర్యప్రభలతో అక్కడుంటాయి.

అది దాటగా కనిపించేది చింతామణి గృహము. ఆ మణి మందిరం మహత్తరమయింది. అచ్చటి మందిర భవన స్తంభాదులూ, సోపానాదులన్నీ సూర్యకాంత చంద్రకాంత మణులతో విద్యుల్లతలవలె ధగధగ మెరిసిపోయే నవ్యదివ్య రత్నాలతో నిర్మించబడినవే. ఆ మందిర మధ్య భాగంలో శ్రీదేవీ నివాస గృహం సహస్ర స్తంభాలతో తేజరిల్లిపోతూంటుంది. దానికి నలువైపులందూ శృంగార, ముక్తి, జ్ఞాన, యేకాంత మండపాలు

భాసిల్లుతూన్నాయి. శ్రీ దేవీ గృహ మండపాదులన్నీ సర్వాంగ సుందరంగా అలంకరించబడి వివిధ ధూప సువాసనలతో నిండి వుంటాయి. ఆ మండపాలను పరివేష్టించి కాశ్మీర, మల్లిక, కుంద వనాలున్నాయి. ఆ ప్రదేశాల్లో కస్తూరీ సుగంధం గుబాళిస్తూం టుంది. ఆ వనాల సమీపంలో రత్న సోపాన పరంపరలతో హంసకారండవాది విహగసంతతులతో "ఝుం ఝుం" నాదాలు చేస్తున్న భ్రమర సముదాయంతొ అమృత రసధారలను ప్రవ హింపజేసే మహాపద్మ వనం వుంది. దాని ఘుమ ఘుమ వాసన లతో ఆ ద్వీపమంతా గుబాళిస్తూంటుంది. శృంగార మండప సభా మధ్య ప్రదేశంలో భువనేశ్వరీదేవి రత్నసింహాసనా సీనురాలు కాగా అసంఖ్యాకులయిన అప్సరో భామలు తమ నాట్య సంగీతా లతో ఆమెను ఆనందపరుస్తూంటారు. అంత ఆ భువన జనని ముక్తి మండపంలో వుండి ముక్తినీ, జ్ఞాన మండపంలో వుండి జ్ఞానాన్నీ, భక్తులకు అనుగ్రహిస్తూ, యేకాంత మండపంలో వుండి మంత్రిణులతొ కలిసి విశ్వంలోని సర్వకార్యాలనూ పరిశీలిస్తూ స్వయంగా జగద్రక్షణభారం వహిస్తుంది. చింతామణీ సదనం లోని మధ్యభాగంలో దశసోపానాలతో శక్తి తత్త్వాత్మకమైన పర్యంకం ఒకటి ఉంది. ఆ మంచానికి బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు కోళ్ళుగా అమరి వున్నారు. సదాశివుడు ఫలకస్థానంలో తేజరిల్లుతూన్నాడు. అట్టి పర్యంకంమీద భువనేశ్వరుడైన మహా దేవుడు భాసిల్లుతూంటాడు తన క్రీడా విలాస లీలల నిమిత్తం భువనేశ్వరీదేవి సృష్ట్యాదిలో రెండుగా విభజింపబడి కామేశ్వరుని వామభాగంలో తేజరిల్లుతూంటుంది. ఆ భువనేశ్వరుడు కోటి కంద

ర్పుల నధిగమించిన సుందరాకారంతో, పంచవదనాలతో, నేత్ర త్రయంతో, మణిభూషణాలంకారాలతో, పదహారు సంవత్సరాల కోడె వయస్సులో కోటి సూర్యుల ప్రభలతో, కోటి చంద్రుల శీతలత్వంతో, శుద్ధ స్ఫటికంలా ప్రకాశిస్తుంటాడు. ఆ మహేశ్వరుని అర్ధాంగియైన భగవతి భువనేశ్వరీ దేవి నవరత్న ఖచితమైన మొలనూలుతో, వైడూర్య ఖచితమైన సువర్ణ కేయూరాలతో, గోళాకృతిలోనున్న కర్ణాభరణాలతో సువర్ణకమలంలా మందస్మిత వదనారవిందయై ముద్దుమోముతో, అర్ధచంద్రుని పోలు ఫాల భాగంతో దొండపండు వంటి పెదవితో కస్తూరీ కుంకుమలతో దానిమ్మ గింజలవంటి పలువరసతో, వజ్రాల ముంగరలతో, భ్రమరాలవంటి వినీల కేశపాశంతో, కుంకుమతో, అనర్ఘ్యరత్న స్థగిత మకుటంతో చూడాలం కారంతో, కుంకుమ కర్పూర గంధాదులతో నిండిన వక్షఃస్థలంతో, సుందర కంఠంతో, సుడిగుండం వంటి బొడ్డుతో, మాణిక్యాంగళీయకాలతో, కంకణాలతో, రవిక మీద, గళసీమలోను మెరిసిపోయే వివిధ రత్నాభరణాలతో పద్మ దళాలవంటి విశాల సుందర నేత్రాలతో, మల్లిక, మాధవి, మాలత్యాది పుష్పమాలలతో కూడిన కబరీభారంతో, విద్యులతనుబోలిన శరీరాంగాలతో, కరుణాతరంగిత కటాక్షవీక్షణాలతో, పాశాంకుశ వరాభయ హస్తాలతో, తేనెలూరు సరస సల్లాపాలతో, శృంగార వేషంతో, వర్ణనాతీత శరీర కాంతితో భాసిల్లుతూంటుంది. ఆ జననిని ఇచ్ఛ, జ్ఞాన, క్రియాశక్తులూ, లజ్జతుష్టి, పుష్టి, కీర్తి, కాంతలూ నిరంతరం సేవిస్తూంటాయి. విలాసినులెందరో ఆ తల్లిని సేవిస్తూ వుంటారు. ఆమె కిరుపార్శ్వాలలో నవనిధులూ

వుంటాయి. ఆ నిధుల నుండి సప్తధాతుమయ స్రవంతులు బయ ల్వెడలి అమృత సాగరంలో లీనమైపోతూంటాయి. మహేశ్వరుని సర్వేశ్వరత్వానికి అతని వామభాగంలో భాసిల్లే భువనేశ్వరియే కారకురాలు. సహస్ర యోజనాల పొడవూ అంతే వెడల్పూ కలిగి ఆ చింతామణి గృహం తేజరిల్లిపోతూంటుంది. దానికి వుత్తర భాగంలో వున్న కోట ద్విగుణీకృతంగా వుంటుంది అంతరి క్షంలో నిరాలంబంగా వున్న చింతామణీ గృహం ప్రళయ వేళలో సంకుచితమై పోతూనూ, పునః వర్ధిల్లుతూనూ వుంటుంది. పరమే శ్వరీ చరణ సేవానిరతులయిన దేవదానవ మానవాదులందరూ అక్కడే వుంటారు. దధి, ఘృత, క్షీర, మధుకుల్యలూ, జంబు, ద్రాక్ష, ఆమ్ర, యిక్షురసాలూ ప్రవహిస్తూన్న నదులెన్నో అక్క డున్నాయి. కల్పవృక్షాలకు అంతే లేదు.

అక్కడి వారందరూ ఆ నదులలోని రసాలు పానం చేసి జరామరణ రోగాదులు లేకుండ పదహారు పద్దెనిమిది సంవత్స రాల వయస్సులో వుంటారు. అక్కడ వుండే వారందరి కందరూ యువతీ యువకులే. వారి లావణ్య, సౌందర్య, విలాసాదులు వర్ణనాతీతాలు. అందులో కొందరు సారూప్య సామీప్య సాలోక్య సాయుజ్యాలు పొంది భువనేశ్వరిని ఆరాధిస్తుంటారు. కారణస్వరూప బ్రహ్మమై, శబల విగ్రహమైన ఆ పరదేవతను-సప్తకోటి మహా మంత్రాలూ, మహా విద్యలూ రూపుదాల్చి స్తోత్రం చేస్తుంటాయి. రత్న సర్వస్వ సారభూతమయిన ఆ లోకాన్నీ, ఆ పరదేవతా స్థానాన్నీ అభివర్ణించ గలవారలు లేరు. అందమైన ఆ మణిద్వీపం సుందరమైన లోక దర్పణం లాంటిది.

స ం పూ ర్ణ ం

## వేయిమంది శాశ్వత సభ్యులను సాదరంగా ఆహ్వానిస్తున్నాం

ఆర్ష గ్రంథరత్న ప్రచురణ విశేష ప్రచారోద్యమమే మా లక్ష్యం. 1991 గోదావరి పుష్కరాల సందర్భంగా అత్యద్భుత సత్ఫలదాయకమైన శ్రీరామరక్షా స్తోత్రమ్ లక్షప్రతుల ప్రచురణ వితరణోద్యమంలో భాగంగా తమ గోత్రనామాలపై రు.350/-లు మాత్రం చెల్లించి సభ్యులుగా చేరి ఈ మహావకాశాన్ని మీరు వినియోగించుకుని, మీ ద్వారా కనీసం మరి పదిమంది భక్తులకైనా ఈ సద్వార్తను అందించండి.

## సభ్యులకు అందజేయు విశేష సదుపాయాలు.

ది 31-1-1991లోగా తమ గోత్రనామాలపై శాశ్వత చందా దారులుగా చేరువారికి వెండిపై చెక్కబడి 9 రోజులు పూజ చేయ బడిన - ఈ క్రింది ధారణా యంత్రాలలో కావలసిన ధారణా యంత్రాన్ని అందజేయగలము. చందా అందగానే రిజిష్టర్డ్ బుక్ పోస్ట్‌లో ఈక్రింది గ్రంథరత్నాలను పంపగలము.

1. అధ్యాత్మ రామాయణము [వచనం] రు 40-00 2. ఉపనిషద్వాణి [కథలు] రు 30-00 3, గాయత్రీ దివ్యశక్తి [వచనము శ్లోకాలు] రు 20-00 4. శ్రీ లలితా దివ్యస్తోత్ర రత్నావళి[పూజా విధానంతో] బైండ్ రు 25-00 5. శ్రీ లలితా సహస్రం-వివరణతో రు 15-00 6. శ్రీదేవీ మాహాత్మ్యము [పూజావిధాన, సప్తశతీమూల శ్లోకాలతో] రు 10-00 7. హనుమచ్చరిత్ర పూజావిధానంతో రు 10-00 8. మహాదాత కర్ణ [అచ్చులో] 9. భీష్మ పితామహుడు 10. విరాటపర్వం [వచనం] రు 15-00 11. విదురనీతి 12. భాగవత మహాపురాణము [ప్రథమ సంపుటము] రు 25-00 13. ప్రహ్లాద చరిత్ర రు 3-00 14. స్తోత్రరత్నావళి [అచ్చులో]

రు 10-00. ధారణా యంత్రాలు : 1. శ్రీచక్ర 2. శ్రీరామరక్షా 3. ఆంజనేయ 4. శ్రీదుర్గా 5. కళ్యాణ కారక ధారణాయంత్రం వీటిలో మీకు కావలసినది వ్రాయండి. వి.పి. పద్ధతి లేదు.శాశ్వత చందాదారులకు భవిష్యత్తులో కూడ మా ప్రచురణలు ఉచితంగా అందుచుండ గలవు,

## సభ్యులకు అందజేయు విశేష సదుపాయాలు

రు. 100-00లు అందజేయు సభ్యుల గోత్రనామాలపై ఓరోజు శ్రీ రాజరాజేశ్వరీ సహిత శ్రీ మారుతీ సీతారాములకు అష్టోత్తర శతనామార్చన చేసి - రాగిపై చెక్కబడిన శ్రీరామరక్షా ధారణా యంత్రము, శ్రీచక్రధారణా యంత్రాన్నీ పూజా సింధూర, కుంకు మాలనూ- సద్వినియోగార్థం అత్యద్భుత ఫలప్రదాయకమైన శ్రీ రామరక్షా స్తోత్రం యొక్క 10 ప్రతులనూ, శ్రీచక్ర బహువర్ణ చిత్రాన్నీ, శ్రీరామరక్షాయంత్ర చిత్రాన్నీ అందజేయ గలము. అంతేకాదు- 1. మహాదాత కర్ణ 2. భీష్మ పితామహుడు 3.విరాట పర్వము [వచనం] 4. విదురనీతి 5. హనుమచ్చరిత్ర - అను గ్రంథరత్నాలను రికార్డెడ్/డెలివరీ ద్వారా పంపగలము. లక్ష ప్రతులు ముద్రణ కావాలి. కావున సత్వర సహకారాన్ని అంద జేయ గోరుచున్నాము. మనియార్డర్ కూపన్‌లో గోత్రాన్ని-పూర్తి చిరునామానూ స్పష్టంగా వ్రాయాలి.

సంపూర్ణ వివరాలకు : ఫోన్ : 7 6 3 5 6

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

భాగవత మందిరం, జయశ్రీ టాకీస్ కుడివైపు సందులో

రా జ మం డ్రి - 4.

## శ్రీ రాజరాజేశ్వరీ సహిత
## శ్రీ మారుతీ సీతారామ మందిరంలో
## జరుగు నిత్య, విశేష కార్యక్రమ వివరాలు

### 卐 దైవస్మరణ మానకండి 卐

ఉదయం 6-30 గం॥ల నుండి ; శ్రీరామరక్షా యంత్రారాధన, శ్రీరామరక్షా స్తోత్ర, మారుతి స్తోత్ర, హనుమత్ సూక్త, హనుమత్ బడబాలన స్తోత్ర పారాయణలు.

సాయంకాలం 6 గంటల నుండి : శ్రీచక్రారాధన, పై స్తోత్ర పారాయణలతో శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర, నవ రత్న మాలికాస్తోత్ర పారాయణలు, ప్రసాద వితరణలు,

ప్రతి మంగళవారం సాయంకాలం హనుమదుపాసనా బలంతో ప్రశ్న చెప్పి, సమస్యా పరిష్కారానికి మార్గాన్ని సూచించుట. ప్రతి శుక్రవారం : శ్రీ లలితా పరమేశ్వరికి యధాశక్తి సుగంధ కుసుమ, కుంకుమార్చనలు, ప్రసాద వితరణ.

✱ రాత్రి గల ప్రతి పూర్ణిమకు శ్రీసూక్త సంపుటీ విధానంతో, పీఠార్చనతో శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతకు అఖండ కుంకుమ, పుస్తకరూప దివ్యపుష్పార్చన, దివ్య ప్రసాద, పుస్తక వితరణ. N. B. : ఇందులో సభ్యులకు మాత్రమే ప్రవేశము. స్వయంగా రాజాలని సభ్యుల గోత్ర నామాలపై విశేషార్చన జరిపించి పూజా కుంకుమ సిందూరాదులను పంపగలము. నాడు విధిగా సభ్యుల

ద్వారా శ్రీ లలితా స్తోత్ర మంజరి 1000 పుస్తకాల నుండి, 3 వేల ప్రతుల వరకు వితరణ జరగాలి. కనుక పూర్ణిమ పూజలో 33 మంది సభ్యులకు మాత్రమే పాల్గొనడానికి సావకాశం కలుగుతుంది. గమనించి సహకరించ గోరుచున్నాము.

1990 డిసెంబర్ 2వ తేదీ ఆదివారం సాయంకాలం 6 గంటల నుండి పూజ ఆరంభ మవుతుంది. నాటికి విధిగా "శ్రీ లలితా స్తోత్రమంజరి" 3 వేల ప్రతుల ప్రచురణ, దివ్య ప్రసాద వితరణల నిమిత్తం సుమారు 10 వేల రూపాయలు వ్యయం కానున్నవి. ది 25-11 1990 లోగా తమ గోత్ర నామాలపై రు. 333-00ల వంతున అందజేయగల ధన్యాత్ములను సాదరంగా 33 మందిని ఆహ్వానిస్తున్నాము.

## మ హా వ కా శ ం

వీరి గోత్ర నామాలపై సిద్ధిచేసిన శ్రీచక్ర ధారణాయంత్రాన్నీ సద్వినియోగార్థం వీరి శుభనామాన్ని ప్రకటించిన శ్రీ లలితాస్తోత్ర మంజరి 108 ప్రతులనూ పూజా కుంకుమ, సిందూరాదులనూ అందజేయగలము. 25వ తేదీ తరువాత అందజేయువారి శుభ నామాన్ని పుస్తకంలో ప్రచురించుటకు వీలుకాదు. గ్రహించి సహకరించండి.

వివరాలకు :
ఫోన్ **76356**

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**
జయశ్రీ టాకీస్ కుడివైపు సందులో
భాగవత మందిరం - రాజమండ్రి-4.

పిబత భాగవతం రసమాలయం

"భాగవతామృతాన్ని జీవితాంతం పానం చెయ్యండి"

# భాగవత
# మహాపురాణ ప్రచురణకు

సత్వర సహకారాన్ని అందించండి.

మనశ్శాంతిని ప్రసాదించడంలో సమస్త గ్రంథ రత్నాలలో అగ్రస్థానాన్ని అలంకరించిన భాగవత మహాపురాణ రత్న ప్రచురణకు,మహాభాగ్యంగా భావించి సర్వులకూ ఆదర్శ మార్గాన్ని చూపే స్థాయిలో నిండు హృదయంతో సహకరించెదరు గాక !

లక్ష రూపాయల వ్యయంతో విడుదల కావలసియున్న ఈ మహాపురాణంలో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధాలు కల ప్రథమ సంపుటం ద్వితీయ ప్రచురణకు సిద్ధంగా ఉంది.

చతుర్ధ, పంచమ స్కంధాలు కల ద్వితీయ సంపుటాన్ని 1991 సంక్రాంతి శుభాకాంక్షలతో విడుదల చేయనున్నాము.

అంతేకాకుండ - ఈ మహాపురాణ విశేష ప్రచారదృష్ట్యా భాగవత మాహాత్మ్యాన్ని కూడ పరమ పవిత్ర గోదావరీ పుష్కరాల సందర్భంగా దాతల సంపూర్ణ సహకారంతో, వారి ఆత్మీయుల దివ్య సంస్మరణగా కనీసం పదివేల ప్రతులైనా వితరణ చేయించ దలచినాము.

# రు. 3.000-00లు మహారాజ పోషకులు

సంపూర్ణ భాగవత మహాపురాణ ప్రచురణ విశేష ప్రచారాలకును, భాగవత మాహాత్మ్యం-10 వేల ప్రతుల ప్రచురణ వితరణోద్యమానికినీ - తమ గోత్ర నామ్మాళ్ళపై, వంశ పరిచయంతో కుటుంబపు ఫొటోతో పూజా పారాయణ ప్రసాద వితరణాదుల నిమిత్తమూ కూడా-రు. 3000-00లు అందజేసి మహారాజ పోషకులుగా చేరు ధన్యాత్ములను సాదరంగా 33 మందిని ఆహ్వానిస్తూన్నాము.

ధన్యాత్ములైన శ్రీమంతులారా ! భగవంతుడు ప్రసాదించిన అవకాశాన్ని మీరు సకాలంలో సద్వినియోగం చేసుకుని విశ్వశాంతికి సంపూర్ణంగా సహకరించునట్టి ఈ సత్సాహిత్య ప్రచారానికి మహాభాగ్యంగా భావించి కోటి గోదానాల పుణ్య ఫలాన్ని అందుకో గోరుచున్నాము.

## * మ హా వ కా శం *

భాగవత మహాపురాణ ప్రచురణకు రు. 3000-00లు విరాళాన్ని అందజేయు దాతలకు సిద్ధంగా ఉన్న మా గ్రంథ రత్నాలను అందజేసెదము. భవిష్యత్తులో వచ్చు మా ప్రచురణ లన్నీ ఉచితంగా అందగలము. వీరి ఫొటో వంశ పరిచయం ప్రకటింపబడు "భాగవత మాహాత్మ్యం" ప్రతులు 108 వితరణ నిమితం అందజేసెదము.


వివరాలకు : పురాణపండ రాధాకృష్ణమూర్తి

ఫోన్ 76356 భాగవత మందిరం - రాజమండ్రి-4.